# కంచే చేను మేస్తే





## ముక్తేవి భారతి





ఆంధ్ర ప్రదేశ్ బాలల అకాడమి
హైదరాబాద్ -

KANC C M S
By : MUKTHEVI BHARATHI
*Published by :* Director & Special Officer, A.P. Baalala Academy
% Jawahar Bal Bhavan, P lic Gardens, Hyderabad - 500 004.

ప్రచురణ సంఖ్య : 100

మొదటి ముద్రణ : 1993

ప్రతులు : 5,000

వెల రు. 6-00

ముఖ చిత్రం :

లోపలి బొమ్మలు : ఆనంద్, ఎవిబిఎ ..

టైప్ సెట్టింగ్
వీనస్‌డెస్క్‌టా పబ్లిషింగ్,
70/B. సంజీవరెడ్డి నగర్,
హైదరాబాద్.

ముద్రణ
కళాజ్యోతి .
హైదరాబాద్.

ప్రతులకు
ఆంధ్ర ప్రదే బాలల అకాడమి
జవహర్ బాలభవన్, పబ్లి గార్డెన్స్,
హైదరాబాద్ 500 004

# తొలిపలుకు

**బా**లలకు విద్యావైజ్ఞానిక సాంస్కృతిక రంగాలలో క్రమ వికాసం కలిగించాలనే లక్ష్యంతో ఆంధ్రప్రదే ప్రభుత్వం 1976 ఆంధ్రప్రదే బాలల అకాడమిని స్థాపించింది. నాటి రాష్ట్రపతి ఫక్రుద్దీన్ అలీ అహ్మద్ ప్రారంభం చేసిన బాలల అకాడమికి, నాటి విద్యా సాంస్కృతిక వ్యవహారాల శాఖ మంత్రి ( మండలి వెంకట కృష్ణారావు తొలి అధ్యక్షులుగా ఉన్నారు. బాలల అకాడమి తన లక్ష్యసాధనకోసం చేపట్టిన పథకాలలో బాల సాహిత్య ప్రచురణ పథకం కింద పిల్లలకు మంచి పుస్తకాలు ప్రచురించే కార్యక్రమం ఒకటి.

జవహర్ బాలభవన్ బాలల్లోని సృజనాత్మక కళలను ప్రోత్సహిస్తుంటే బాలభవన్‌లో మరొక భాగమైన బాలల అకాడమి బాలల విజ్ఞానోదయానికి కృషిచేస్తున్నది. బాలల సమగ్ర అభ్యుదయానికి ఇవి రెండూ రెండు కళ్ళు వంటివి. విజ్ఞానాని , వినోదాని రెండూ ఒకే వేదికగా విరాజిల్లుతున్నాయి.

వివిధ వయోవర్గాల బాలల అవగాహన స్థాయికి తగినట్లు, సరళమైన భాషలో, తేలిక పదాలతో కథలు, గేయాలు, గేయకథలు, బొమ్మల కథలు, జీవిత చరిత్రలు, నవలలు, వైజ్ఞానిక రచనలు ప్రచురించటం జరుగుతోంది. రాసిలో కాకుండా వాసిలో శ్రద్ధ వహించి, బాలల్లో విజ్ఞాన వినోద వికాసాలను పెంపొందించి, వారికి ఉత్తమ బాల సాహిత్యం అందించటమే ప్రధాన ధ్యేయంగా పెట్టుకొన్నది బాలల అకాడమి.

అమృత తుల్యమైన బాలసాహిత్య సర్వస్వాన్ని ప్రచురించాలనే సదుద్దేశంతో వెలువరించిన పుస్తకాలలో ఇది ఒకటి.

ఇకపై కూడా బాలలకు ఆసక్తిని కలిగించే పుస్తకాలను ప్రచురించే ప్రయత్నాలు చేస్తున్నాము. ఉత్తమ అ రుచిగల తల్లిదండ్రులు, ఉపాధ్యాయులు - మేము చేస్తున్న ఈ కృషిని బాలలకు అందుబాటులోకి సుకురావటానికి సర్వవిధాలా మాతో సహకరిస్తారని ఆశిస్తున్నాము.

**శారదా అశోకవర్ధన్**

సంచాలకులు మరియు ప్ర ్యకాధికారిణి

జవహర్ బాలభవన్, ఆంధ్రప్రదే బాలల అకాడమి.

# విషయ సూచిక

# ౧. పోరునష్టం

సీత, గీత మంచి స్నేహితులు. కలిసి స్కూలు కెడతారు. కలిసి ఇంటికొస్తారు. వీధి మొదట్లో సీత ఇల్లు, వీధి చివర గీత ఇల్లు. వీళ్ళిద్దరూ బట్టలు కూడా ఒకే రకంగా ఉండేవి కొనుక్కుంటారు. వీరిని కవల పిల్లలేమో అనుకుంటారు స్కూలులో అంతా. వీళ్ళిద్దరినీ చూస్తుంటే టీచర్లకి ఎంతో ఇష్టం. ఇద్దరూ చాలా బాగా చదువుకుంటారు. ఎంతో ఐకమత్యంగా ఉంటారు. ఏనాడూ పోట్లాడుకోగా చూడలేదెవరూ.

"ఒసేయ్ సీతా, ఈసారి ఫస్టు, సెకండు రాంకులు నీకూ, నాకూ రావాలంతే" అంది గీత స్కూలు నుంచి వస్తూ.

"నిజమేనే, ఈ సారి ఫస్టు సెకండు రాంకులు నీకూ, నాకూ రావాలంతే" అంది నడుస్తూ సీత.

ఇంటికివెళ్ళి యూనిఫారమ్ మార్చేసుకుంది సీత. చిన్న పూలపూల ఫ్రాకు వేసుకుంది. టిఫిన్ తినేసింది. వీళ్ళ



పుస్తకాల షెల్ఫు దగ్గర కెళ్ళింది. "బాబోయ్ గ్రామర్, అబ్బ ఎంత కష్టమో, అసలు అర్థమేకాదూ" సీతకి గ్రామరంటే మహాభయం. గ్రామరు బాగా రాస్తే కదా మార్కులు ఎక్కువవచ్చేది. అయితే, గ్రామరు చాలా బాగా వచ్చు గీతకి. అందుకే గ్రామరు పుస్తకం తీసుకుని, నోట్సుతీసుకుని బయలుదేరింది సీత గీత ఇంటికి.

గీత యూనిఫారమ్ మార్చుకున్నాక చిన్న చిన్న పూల ఫ్రాకు వేసుకుంది. రెండు జడలు తల్లిచేత వేయించుకుంది. టిఫిన్ తినేసింది. పుస్తకాల సెల్ఫు దగ్గరకి రాగానే ఎదురుగా గ్రామర్ పుస్తకం కనిపించింది. అబ్బ, నాకెంత ఇష్టమో ఈ గ్రామరు అంటే ఈసారి పరీక్షలో ఎక్కువ మార్కులు సంపాదిస్తా" అలా అనుకుంటూ పక్కకి చూసేసరికి భయంవేసింది. గ్రామర్ బుక్ ప్రక్కనే లెక్కలు బుక్ కనిపించింది. "బాబోయ్ లెక్కలంటే భయం. ఎన్ని సార్లు చేసినా ఏమిటో బుర్రకెక్కవెందుకో" ఆల్జీబ్రా గుండె గాబ్రాతో నన్ను ఏడిపిస్తుంది. ఆల్జిబ్రా ఏమిటీ, అన్ని, లెక్కలుకి సంబంధించినంత వరకు భయమే నాకు. అదేమిటో క్షణాల మీదా చేసి పారేస్తుంది సీత ఎంత పెద్దలెక్క ఇచ్చినా" అనుకుంటుండగానే సీత వచ్చేసింది.

గీత, సీత ఒక నియమం పాటిస్తారు. ఒకరోజు గీత ఇంట్లో చదువుకోవాలి, ఇంకో రోజు సీత ఇంట్లో చదువుకోవాలి. కుంభ వృష్టికురిసినా, భయంకరమైన ఎండలు మాడ్చినా ఈ నియమం తప్పరిద్దరూ.

"నీకు గ్రామర్ ఊరికే తేలిగ్గా అర్థమయిపోయేట్టు నేను చెప్పేస్తా, ఖంగారు పడకు" అంది గీత.

"నీకు లెక్కలు తేలిగ్గా అర్థమయిపోయేట్టు నేను చేప్పేస్తా ఖంగారు పడకు అంది సీత. ఇద్దరు గల గల అనుకున్నారు. పరీక్షలు దగ్గర కొస్తున్నకొద్ది సీత, గీత చాలా శ్రద్ధగా చదివారు.

ప్రోగ్రెస్ రిపోర్టు ఇచ్చేసరికి ఇద్దరి ఫస్టు ర్యాంకే వచ్చింది. ఎవరా ఇద్దరూ ఇంకెవరు సీత, గీత!!

భలేగా ఉందిలే - ఇలాగే మనిద్దరి మధ్యే ఉండాలి. ఫస్టుకానీ, సెకండుకానీ - అంతేనా అంతే!! ఇద్దరు ఒకేసారి అనుకున్నారు. సెలవులయిపోయి మళ్ళ స్కూలు తెరిచారు. ఎందుకో ఇద్దరికీ ఒకళ్ళ మీద ఒకళ్ళకి కోపం వచ్చింది. "ఏమే సీతా - ఎందుకు నాకన్న ముందు స్కూలుకి వెళ్ళిపోయావు" కోపంగా అడిగింది గీత."కాదే మా బాబాయి స్కూటరు మీద దింపుతానంటేను" నసిగింది సీత. "మా అన్నయ్య ఎన్నిసార్లు స్కూటర్ మీద స్కూలు దగ్గరదింపుతానంటే నేను వెళ్ళానా" గీత ముఖం ఎర్రబడింది. "సారీవే పొరబాటే" సీత ఎంత చెప్పినా గీత కోపం పోలేదు. "అవును, మొన్న లత చెప్పింది కూడా, సీతకి బాగా లెక్కలొచ్చునని బలే గర్వంతే అంది. నీవేమన్న నమ్మను దాని మాట" గీత రెట్టించింది. "ఇది బాగుంది. నాకు లెక్కలోస్తే నీకు గ్రామరు రాదా" సీత లెక్కలొచ్చునని గర్వమా ... సరేకానీ, నా దగ్గరకి గ్రామర్‌కి వస్తుందిగా అప్పుడు చెప్తా దాని పని అనుకుంది గీత. "ఈ గ్రామర్ అది చెప్పకపోతే నాకు చెప్పే వాళ్ళే రా అది చూస్తా" ఆ రోజు సాయంత్రం గీత సీత ఇంటికి రావాలి చదువు కుందుకు. సీత చాలా సేపు ఎదురుచూసింది. గీత రాలేదు. పోనీ తను వెడితే, ..... ఆ, అదే రావాలి తన ఇంటికి, అంతే అనుకుంది మళ్ళ. ఆ సాయంత్రం ఎవరిళ్ళలో వాళ్ళు ఉండి పోయారు.

తెల్లారాక స్కూలుకి వెళ్ళడానికి సీత గీత కోసం చాలాసేపు చూసింది. గీత రాలేదు. సీత ఒక్కర్తే స్కూలుకెళ్ళింది. అప్పటికే గీత స్కూల్లో ఉంది. "నువ్వు వస్తావని ఎంతసేపు చూశానో తెలుసా" అంది కోపంగా సీత. "మా అన్నయ్యతో స్కూటర్ మీద

వచ్చేశాను" గీత ఎటో చూస్తు అంది. అలా అలా సీత, గీతలకు మాటల పట్టింపులు పెరిగాయి.

"నీపాటి లెక్కలొచ్చే వాళ్ళే లేరనుకుంటున్నావా. మా అన్నయ్య చేత రెండు రోజులలో చెప్పించుకోగలను" అంది గీత. "నీపాటి గ్రామర్ చెప్పే వాళ్లే రా ఈ ఊళ్లో . . ఎందుకూ మా నాన్న చేత రెండు గంటల్లో ఆ ఇంగ్లీషు గ్రామరంతా చెప్పించుకోగలను తెలుసా" అంది సీత.

మళ్ళ పరీక్షలు వారం రోజులలోకి వచ్చేశాయి. సీత, గీత కలసి చదువుకోటం మానేశారు.

"నాన్నా! నాకు ఇంగ్లీషు గ్రామర్ చెప్పాలండీ, పరీక్షలు ఇంకా నాలుగు రోజులే" అంది సీత.

"నాకెక్కడ తీరిక తల్లీ . . ఇవాళ కాంప్ వెడుతున్నా.. పదిహేను రోజుల వరకు రాను. ఆ గీత బాగా ఇంగ్లీషు వచ్చుగా, ఆ అమ్మాయి చేత నేర్పించుకో" అన్నాడు సీత తండ్రి ఆఫీసుకి వెళ్ళిపోతూ.

"ఒరేయ్ అన్నయ్యా! నాకు లెక్కలు కొన్ని చెప్పాలి. ఎంత చేసినా రావటం లేదు. పైగా పరీక్షలు ఇంకా నాలుగు రోజులే" అంది బతిమాలుతూ గీత అన్నయ్యని.

"నాకు రేపట్నుంచీ ప్రాక్టికల్సు. పొద్దున్న వెడితే ఎప్పుడొస్తానో నాకే తెలియదు. అయినా, నీ ఫ్రెండ్ సీత లెక్కల్లో ఎప్పుడూ ఫస్టేగా, ఆ అమ్మాయి దగ్గర నేర్చుకో" స్కూటర్ మీద వెళ్ళిపోయాడు అన్నయ్య.

పరీక్ష హాల్లో కూర్చున్నాక ఇంగ్లీషు గ్రామరు ప్రశ్నలు చూడగానే సీత ముఖానికి చెమటలు పట్టాయి. ఎంత ఆలోచించినా ఏమీ తెలియటం లేదు. రెండు రోజులయ్యాక

లెక్కల పేపరు చూసిన గీత ముఖంలో ఏడుపు నిండిపోయింది. రెండు లెక్కలు కూడా చేయలేక పోయింది.

స్కూలు తెరిచిన నాలుగు రోజులకే ప్రోగ్రెస్ రిపోర్టు ఇచ్చారు. ఎప్పుడు ఎనిమిదో రాంక్ వచ్చే సుబ్బలక్ష్మికి ఫస్టు రాంకు వచ్చింది. ఎప్పుడూ పదో రాంకు వచ్చే లతకు సెకండు రాంకు వచ్చింది. సీత, గీత ఇరవై, ఇరవై ఒకటి రాంకుల్లో ఉన్నారు.

సుబ్బలక్ష్మి, లత పట్టుదలగా కలసి చదువుకుని తమని ఓడించిన విషయం తెలిసిన గీత సీత ఎంతో బాధ పడ్డారు.

"పోరునష్టం పొందు లాభం" అంటే ఇదేకదూ అనుకున్నారు ప్రోగ్రెస్ కార్డులు చూసుకుని ఇద్దరూ.

ఐకమత్యంగా ఉండటం ఎంత ముఖ్యమో అర్థమయిన సీత, గీత మళ్ళీ స్నేహంగా ఉండటం ప్రారంభించారు. లెక్కలు, ఇంగ్లీషు గ్రామరు ఒకళ్ళకొకళ్ళు చెప్పుకుంటున్నారు. ఒకళ్ళ ఇంటికి మరొకరొచ్చి శ్రద్ధగా చదువుకుంటున్నారు.

*****

# 2. దురాశ దుఃఖం చేటు

స్కూల్లో చేరగానే, కొత్త స్కూలుబాక్సు, కొత్త బూట్లు, కొత్త పుస్తకాలు, కొత్త టిఫిన్ బాక్సు కొనుక్కున్నాడు కిషోర్. వాటిని చూసి రోజూ మురిసి పోయేవాడు.

స్కూలు బాగు పెద్దది. దాంట్లో ఎన్నో పుస్తకాలు పడతాయి. అందులోనే ఓ పక్కగా టిఫిన్ బాక్సుపెట్టు కోవచ్చు. చాలా ఖరీదయినా ఎంతో బావుందని వాళ్ళమ్మచేత కొనిపించు కున్నాడు కిషోర్.

కిషోర్, రమేష్ స్కూలు వెడుతుంటే ఓ అబ్బాయి సైకిలు మీదొచ్చిపక్కనఆగాడు.

'బాబూ ఏం చదువు కుంటున్నారూ'

'నాల్గవ క్లాసండీ'



'మీ స్కూలు మంచిదేనా?

'ఓ చాలా మంచిదంకుల్ - ఎందుకు?'

'ఆఁ.. ఏంలేదు. మా తమ్ముణ్ణి మీ స్కూల్లో చేర్పిద్దామని.'

"చేర్పించండి. అదే నండీ మా స్కూలు" షోర్ ఉత్సాహంగా మాట్లాడాడు. ఆ అబ్బాయితో "వాడు చాలా మంచివాడు కదరా కిషోర్, రమేష్‌తో అన్నాడు. "పోరా, వాడు పెద్ద దొంగలా ఉన్నాడు"

"ఛీ - నీ కన్నీ అలాగే అనిపిస్తాయి. పాపం వాడు మంచివాడు" షోర్ మాటల రమేష్ బోల్డు కోపం వచ్చింది.

"వాడికి స్కూలు విషయాలు కావాలంటే స్కూల్లో వచ్చి కనుక్కోవాలి కదా!"

అంతలోనే స్కూల్లో గంట వినిపించింది ఇద్దరి . పరుగెత్తి క్లాసుకు వెళ్ళి పోయారు.

రెండు రోజులయ్యాక మ ్ళ ఆ అంకుల్ కనిపించాడు. "ఇది తీసుకోండి.. మీ కోసమే తెచ్చాను" ఇద్దరికీ చెరో బాల్‌పెన్ను ఇచ్చాడు.

'వద్దండీ' రమేష్ తీసుకోటానికి వెనకాడాడు.

"అబ్బ ఎంత బావుందోనండి. థాంక్స్" కిషోర్ గబాలున ఆ పెన్ను జేబులో పెట్టుకున్నాడు.

"డబ్బులు తీసుకోండి" రమేష్ జేబులోంచి రూపాయి చిల్లర పోగు చేశాడు.

'వద్దు బాబూ - నాకు చిన్న పిల్లలంటే ఎంతో ఇష్టం. పైగా మీలా బుద్ధిగా చదువుకొనే పిల్లలంటే మరీ ఇష్టం. చక్కగా రాసుకోండి. నాకు పనుంది. వెళ్ళనా మరి' ఆ అబ్బాయిసై లు ఎక్కగానే కిషోర్ టాటా చెప్పాడు.

మ ళ్ళ నాలుగు రోజులకి కనిపించాడు సై లబ్బాయి. 'నిన్న మీరు రాలేదా బాబూ'.

"మాకు సెలవండి నిన్న. ఒక వారం రోజులోస్తే ఇంక మాకు సెలవులే" కిషోర్ అనగానే,

'ఒక్క వారం రోజులేనా' అన్నాడు అబ్బాయి. "మీ కోసం ఎన్నో పెన్నులు కొనిపెట్టాను. రేపు తీసుకురానా" - షోర్ చాలా సంతోషమేసింది. రమేష్ త్వరత్వరగా నడవటం మొదలుపెట్టాడు. ఆ అబ్బాయి వెళ్ళిపోయాడు.

తెల్లారిన దగ్గర నుంచి కిషోర్ ఆలోచన అంతా ఆ అబ్బాయి తెచ్చే పెన్నుల మీదే ఉంది. బోల్డు పెన్నులు తెస్తానన్నాడు. బోల్డు అంటే ఎన్ని.... ఓ నాలుగు బాల్‌పాయింట్ పెన్నులయి ఉంటాయి. ఎలా రాస్తామో చూడాలి. కిషోర్ గబగబా అన్నం తిన్నాడు. యూనిఫారమ్ వేసుకున్నాడు. బూట్లు వేసుకున్నాడు. తన స్కూలు బ్యాగులో కొత్త పుస్తకాలు, ఓ పక్క టిఫిన్ బాక్సు సర్దుకున్నాడు.

స్కూలుకి వెడుతుంటే సైకిలబ్బాయి కనిపించగానే కిషోర్ ముఖం ముడుచుకున్నాడు. స్కూలు నించి వచ్చేటప్పుడు రమేష్, అన్నాడు 'ఒరేయ్ - నీ ఇష్టం నేను ఇంటికె ్ళపోతా- నీవు ఆ పిచ్చి పెన్నుల కోసం కూర్చో. ఒ-య్ - నా మాటవిను. ఇంటి వెళ్ళిపోదాంరా."

"నువ్వెళ్ళు - నేను వస్తాలే" మొండిగా స్కూలు దగ్గరే ఉండి పోయాడు కిషోర్. రమేష్ వెళ్ళిపోయిన రెండు నిముషాల్లో వచ్చేశాడు సైకిలబ్బాయి. షోర్ బలే సంతోషం కలిగింది.

'తెచ్చారా ... అంకుల్'?

"ఊ - ఇవి తీసుకో ముందు" రెండు బాల్ పాయింట్ పెన్నులు చేతికిచ్చాడు.

'నీ దగ్గర సంచీ ఏమన్నా ఉందా'? సైకిలు అంకుల్ అడిగాడు.

"లేదంకుల్"

"మరి ఈ పెట్టె ఇస్తావా. దీన్నిండా పెన్నులు తెచ్చి ఇస్తాను. ముప్ఫయి పెన్నులు పట్టాలికదా".

"ముప్పయి పెన్నులా ... అంకుల్ ఈ పెట్టె తీసుకెళ్ళండి" - కిషోర్ టిఫిన్ బాక్సు తీయబోయాడు.

"అది అలాఉంచేయ్ . . . . అ పెట్టెలో ఓ పక్కగా అది ఉంటే మనకేం కష్టం. నేను పెన్నులు ఈ పుస్తకాల మధ్యలో జాగ్రత్తగా సర్ది తెస్తాను. ఇప్పుడే అయిదు నిముషాల్లో వస్తాను. ఎక్కడికీ వెళ్ళకూ" సైకిల్ అంకుల్ పెట్టె తీసుకుని వెళ్ళిపోయాడు.

ఎన్ని పెన్నులో, అవి ఏవ రంగులో, వాటితో ఏవ నోట్సు రాసుకోవాలో, రోజూ ఒక పెన్ను తీసికెడితే క్లాసులో పిల్లలందరి ముందు ఎంతగొప్పగా ఉంటుందో అని ఊహించుకుంటూ స్కూలు గేటు బయట ఉన్న రాతి మీద [illegible]

అయింది, గంట అయింది-చీకటి పడిపోయింది. సైకిలబ్బాయి ఏడీ? పెన్నులు ఏవీ? తన స్కూలు బాక్సు ఏదీ? షోర్ భయమేసింది. ఏడుపొచ్చింది. ఇప్పుడు ఇంటికెడితే అమ్మ కొడుతుంది. ఎలాగ?. . . ఇంకా ఆ అబ్బాయి వస్తాడనే ఆశతో ఇంటికెళ్ళాలంటే భయంతోనూ అలాగే ఆ రాతి మీద కూచున్నాడు ఏడుస్తు కిషోర్.

"ఒరేయ్ రమేష్ మావాడేడీ... నువ్వొచ్చినప్పుడు వాడు రాలేదేం?" షోర్ తల్లి కంగారుగా అడిగింది.

"ఇంకా రాలేదా ఆంటీ? రమేష్ కూడా భయమేసింది. పిల్లల్ని ఎత్తుకుపోయే దొంగలొచ్చారట ఊరికి బాబోయ్? రమేష్ భయంగా కిషోర్ తల్లి వైపుచూస్తూ,"ఆంటీ, మీరు నాతోరండి . .. స్కూలు దగ్గర వెళ్ళ చూద్దాం" అన్నాడు చెప్పులు తొడుక్కుంటూ. ఇద్దరూ గబగబా నడిచారు.

మోకాళ్ళ మీద తలాన్చి వె క్కవెక్కి ఏడుస్తూ కనిపించాడు కిషోర్.

"ఏమిటిరా ... ఏమైందీ"? కిషోర్ మాట్లాడ లేదు తల్లి అడుగుతుంటే. రమేష్‌కి అర్థమయిపోయింది.

"నీ స్కూలు బాక్సు ఏదిరా?" - రమేష్ పశ్న సమాధానం చెప్పలేదు కిషోర్.

"అనుకున్నట్టే అయిందా... ఆ సైకిలంకుల్ పెన్నులు తెస్తానని నీ పెట్టె ఎత్తుకు పోయాడా....?"

"ఊఁ" కళ్ళు తుడుచుకున్నాడు షోర్. "నేచెప్తే విన్నావా...?" దురాశ దుఃఖం చేటు" అంటే ఇదేరా .. అయినా నీకు ఒక్క

పెన్ను చాలదా రాసుకుందుకు.వాడు ముప్ఫయి పెన్నులు తెచ్చిఇస్తాడా.... నీకు ఇప్పుడయినా బుద్ధి వచ్చిందా.?" రమేష్ అంటూంటే విషయం అర్థమయింది కిషోర్ తల్లికి.

"అంటే డెబ్భై రూపాయిల మెటల్ బాక్సు, ఎన్నో పుస్తకాలు పట్టేవి అందులో, అదికాక టిఫిన్ బాక్సు, కొత్తగా కొనుక్కున్న పుస్తకాలు అన్నీ పోయాయన్న మాట... ? "పద, ఇంటికి" కిషోర్ తల్లి వెంట తలవంచుకు నడిచాడు.

ఇంట్లో ఉన్న గుడ్డ సంచిలో పుస్తకాలు పెట్టుకుని, పాత టిఫిన్ బాక్సు పట్టుకు స్కూలికి వచ్చాడు కిషోర్.

అపరిచితులను నమ్మితే వచ్చే అనర్థం అనుభవమయింది కిషోర్‌కి. దురాశకు పోయి దుఃఖం కొని తెచ్చుకున్నాడు.

*****

# 3. తాచెడ్డ కోతి

కిరణ్, విజయ, సీత ఒకే స్కూల్లో చదువుకుంటున్నారు. అందరూ కలసి స్కూలుకి వెడతారు రోజూ. ఎలాగంటే, ఓ పెద్ద మేడలో ఉన్న మూడు భాగాలలో అద్దెకుంటున్నారు వీళ్ళు. హోంవర్కు చేసుకునేప్పుడు ముగ్గురూ కలిసి ఒకే ఇంట్లో కూచుని చేసుకుంటారు. ఎవరి ఏదైనా తెలియకపోతే ఇంకోరు సహాయం చేస్తారు.

వేసవి సెలవు లిచ్చేశారు. ఆ రెండు నెలలలో ఇంగ్లీషు లెక్కలు బాగా నేర్చుకున్నాడు కిరణ్. బాలభవన్‌లో చేరి ఈత నేర్చుకున్నాడు విజయ. పిల్లల కరాటే నేర్పుతుంటే నేర్చుకుంది సీత.

సెలవులయి పోయాయి. స్కూలుకి ఉత్సాహంగా వెడుతున్నారు పిల్లలు ముగ్గురూ. మొదట నెల టెస్టు నుంచీ అన్నిట్లోనూ ఫస్టు వస్తున్నాడు రణ్. మేష్టర్లందరి కిరణ్



అంటే చాలా ఇష్టం. బాగా చదువుకొనే పిల్లలు, బుద్ధిమంతులు అంటే మేష్టర్లందరి ఇష్టముంటుంది కదా మరి!!

ఆ స్కూల్లోనే పై తరగతిలో వచ్చి చేరాడు మోహన్. మోహన్ ఇంటి వాళ్ళ మనుమడు. చాలా డబ్బున్న పిల్లాడు. బాగా గారాబంగా పెరిగిన వాడు.

కిరణ్, విజయ, సీతలతో బాగా స్నేహం మొదలు పెట్టినా రణ్ బాగా నచ్చాడు మోహన్‌కి.

"ఒరేయి కిరణ్, రోజూ స్కూలు కేమిటిరా బోర్ . ఈ రోజు సినిమా కెళదామా" మోహన్ అనగానే ఆశ్చర్యంగా కళ్ళు పెద్దవి చేశాడు రణ్.

'అమ్మో! స్కూలు మానేయటమే"

పకపక నవ్వాడు మోహన్. "ఒక రోజు స్కూలు మానేస్తే ఏమవుతుందిరా . . . పద, పద, సినిమాకెళదాం" ఎంత రానంటున్నా బలవంతం చేసి సినిమాకి లాక్కెళ్ళాడు కిరణ్‌ని మోహన్. హాలులో కూర్చున్నా భయంగానే ఉంది కిరణ్ .

రోజు రోజుకీ మోహన్‌తో స్నేహం ఎక్కువైంది. నెమ్మదిగా విజయ, సీతలతో కలసి స్కూలుకి వెళ్ళటం మానేసి, మోహన్‌తో కలసి వెళ్ళటం మొదలెట్టాడు కిరణ్. స్కూల్లో నిద్ర పోవటం, హోంవర్కు చేయకుండా దెబ్బలు తినటం అలవాటయి పోయింది కిరణ్‌కి.

ప్రోగ్రెస్ కార్డు చూడగానే ఏడుపొచ్చింది రణ్‌కి. తనకి పదహారోరాంక్ . . . ఎప్పుడూ ఒకటి, రెండు రాంకుల్లో వచ్చే తనని పదహారోరాంక్" అమ్మచేత ఎలా సంతకం పెట్టించాలి - ప్రోగ్రెస్ కార్డు చూస్తూ విచారంగా కూచున్నాడు కిరణ్. బెల్లుఅయిపోయింది. పిల్లలంతా వెళ్ళిపోయారు.

'ఈ మార్కులు అమ్మ చూస్తే నన్ను చంపేస్తుందిరా!' ఏడుపు ముఖం పెట్టాడు రణ్.

'ఓ .. అదా ఇటివ్వు .. అసలు అమ్మ సంతకం పెట్టేదేమిటిరా' మోహన్ ఆ ప్రోగ్రెస్ కార్డు తీసుకున్నాడు. "అంటే"

"ఇటు చూడు"...

"తులసమ్మ" గబగబా సంతకం చేసేశాడు మోహన్. "దొంగ సంతకం. టీచరు చూస్తే!!"

'నీ ముఖం డెబ్బైయి మంది పిల్లల్లో టీచరు ఈ సంతకం గుర్తు పడుతుందా, పద, పద, ఇంటికెడదాం. కిరణ్‌కి కొంచెం ధైర్యం వచ్చింది. అచ్చం అమ్మ చేసేటట్లే చేశాడు. అబ్బ, మోహన్ బలే తెలివైనవాడు అనుకుంటూ ఉత్సాహంగా ఇంటికొచ్చేశాడు కిరణ్.

రెండు నెలల నుంచీ అలాగే చేయడం అలవాటయి పోయింది కిరణ్‌కి. పైగా మోహన్ స్నేహం రోజురోజు ఎక్కువై పోయింది.

"బాబూ - నీ ప్రోగ్రెస్ కార్డు ఏదీ .. కిందటి నెల, ఈ నెల నేను సంతకం చేశానా" అంది తులసమ్మ కిరణ్ అన్నం వడ్డిస్తూ. ఉలిక్కిపడ్డాడు రణ్ఒక్కసారి.

"ఇవ్వటం లేదమ్మా ... మా రామం మేష్టారు ఊళ్ళో లేరు" అన్నాడు వెంటనే.

"అలాగే .. ఇంకొంచెం పెరుగు పోసుకో" పెరుగు తినబుద్ధి వేయలేదు కిరణ్‌కి అప్పుడు.

"మేష్టారు ఊళ్ళో లేరా ... "

ఆ గొంతు విని తలెత్తాడు రణ్. మేష్టారు ఎప్పుడొచ్చారో. "రండి బాబూ కూర్చోండి" తులసమ్మ కుర్చీ వేసింది. "చూడు

తులసమ్మా .. నువ్వు ఎంతో కష్టపడి పిల్లాడిని చదివిస్తున్నావు... ఎంతో డబ్బు వాడి పుస్తకాల కోసం, బట్టల కోసం ఖర్చు చేస్తున్నావు.. కానీ వీడు నీతో అబద్ధాలు చెబుతున్నాడు. కిందటి నెలలో పదహారో రాంకు, ఈ నెలలో ఇరవై ఒకటో రాంకు వచ్చాడు. ప్రోగ్రెస్ కార్డు మీద నీ సంతకం లాగే సంతకం కూడా చేశాడు" మేష్టారి మాటలకి విస్తు పోయింది తులసమ్మ. కిరణ్ వంచిన తల ఎత్తలేక పోయాడు.

"ఇదేనమ్మా... తాచెడ్డకోతి వనమెల్లా చెరిచిందంటే - వీడు ఆ మోహన్ స్నేహం వదలాలి. వాడు ఓ కోతి. నిలకడ లేదు. వాడు చెడ్డమే కాక వీణ్ణి చెడగొడుతున్నాడు. ఎంత మంచి రాంకు నుంచి ఎంత కిందికి జారిపోయాడో చూశావా. మంచి స్నేహం పిల్లల చాలా అవసరం" మేష్టారు గంభీరంగా అన్నారు. కిరణ్‌కి అర్థమై పోయింది. తను ప్రోగ్రెస్ కార్డు మీద దొంగ సంతకం చేయించిన విషయం కూడా మేష్టారికి తెలిసి పోయింది. మోహన్ స్నేహంతో చదువులో వెనక బడ్డాడు. అబద్ధాలు ఆడాడు. క్లాసుకి రాకుండా సినిమాలు చూడటం మొదలు పెట్టాడు. ఛీ, ఎంత చెడిపోయాడు తను. కిరణ్ గదిలో కెళ్ళి రహస్యంగా ఏడ్చాడు. "ఇంక ఎప్పుడూ నేను ఆ మోహన్‌తో స్నేహం చేయను" ఎదురుగా గోడ మీదున్న దేముని పటానికి నమస్కరించి చెంపలు వేసుకున్నాడు. గదిలో నించి వచ్చి మేష్టారి కాళ్ళ మీద పడ్డాడు ఏడుస్తూ.

అప్పటి నుంచి కిరణ్ మళ్ళ విజయ, సీతలతో కలిసి స్కూలుకి వెడుతున్నాడు. అందరూ కలిసి హోంవర్కు చేసుకుంటున్నారు. రెండు నెలలు తిరిగేసరికి కిరణ్ మళ్ళా ఫస్టు రాంకుకి వచ్చాడు. మేష్టారు కిరణ్ ఇంటికొచ్చి, భుజం తట్టి మెచ్చుకున్నాడు. కిరణ్ మేష్టారి కాళ్ళకి వంగి నమస్కారం పెట్టాడు.

*****

# .. ఆవులు కుమ్ము లాడు కుంటే

ఇదిగో నిన్నే' చాటలో బియ్యం పోసి రాళ్ళేరుతున్న రాములమ్మ అరిచింది. హోంవర్కు చేసుకుంటున్న శోభ పరిగెత్తుకొచ్చింది. "వాడితో మాట్లాడవద్దంటే మానవా?" గదిమింది తల్లి.

"ఏమో హోం వర్కు అయ్యాక నేను వాడితో ఆడుకుంటాను.

"ఏమిటీ... ఆడుకుంటావా వాడితో, మళ్ళ అను ఆమాట" రాములమ్మ శోభ వీపు మీద దభీదభీ గుద్దింది.

"ఒరేయ్ ... శివా .. ఎన్ని సార్లు పిలవనురా గొంతు నొప్పి పుడుతుంది... వాళ్ళ గుమ్మంలోకి వెళ్ళద్దని చెప్పలేదా? ఆ పిల్లతో మాట్లాడవద్దని చెప్పాను కదా!" వెంకటమ్మ అరుస్తుంటే లాగుపైకి తోసుకుంటూ వచ్చాడు శివ.



"ఆ పిల్లతో ఎందుకు మాట్లాడువద్దూ.. మేమిద్దరం కలిసి నోట్సు రాసుకోవాలి" శివ పెన్సిల్ నోట్లో కొరుకుతూ అన్నాడు. "ఏమిటీ అన్ని చెప్పినా మళ్ళీ అదేమాట" చెంప ఛెళ్ళుమని పించింది వెంకటమ్మ.

శోభ, శివ మూడో క్లాసు చదువుతున్నారు. ఎదురెదురిళ్ళలో ఉంటున్నారు. తల్లులిద్దరూ పోట్లాడు కుంటుంటే పిల్లలూ నలిగిపోతున్నారు మధ్యలో.

"వెడతా, ఏం చేస్తుందో చూస్తా అమ్మ" అనుకుంటూ వ ఎదురింట్లోకి వచ్చాడు. శోభ ఏదో మాట్లాడుతోంది.

'మాఇంటికి రావద్దని ఎన్నిసార్లు చెప్పాను, పో బుద్ధిలేదు" తోసేసింది రాములమ్మ శివని. అంతలోనే' అక్కడి కెందుకెళ్ళావురా ... రా, చెప్తా, కాళ్ళు విరక్కొడతా" గుమ్మంలో నుంచే అరుస్తోంది వెంకటమ్మ.



"ఏమమ్మా మీ పనిమనిషి కాగితాలు ఊడ్చి మా గుమ్మంలో పోసింది... వచ్చి ఎత్తమను లేకపోతే నువ్వొచ్చి ఎత్తు" వెంకటమ్మ గొంతు పెంచింది.



"ఏమిటీ .. నేనొచ్చి ఎత్తాలా .. నేను పనిమనిషినను కున్నావా ... నీ పొగరు కళ్ల నెత్తికెక్కాయి" రాములమ్మ తిట్టింది.

"నాకేం తెలుసూ పనిమనిషివో కావో" వెంకటమ్మ అంటూండ గానే రాములమ్మ తన ఇంటి గుమ్మం ముందున్న కాగితాలు గబగబా ఎదురింటి వైపు ఊడ్చింది. పిల్లలిద్దరూ ఫక్కుననవ్వారు.



రోజు రోజుకీ వెంకటమ్మ, రాములమ్మ పోట్లాటలు పెరిగిపోయాయి. పిల్లల్ని మాట్లాడు కోనియ్యటం లేదు. ఆడుకోనియ్యటం లేదు.

"మీ నాన్న రానీ, నీ పని చెప్తా ... తల్లి మాట బొత్తిగా వినటం లేదని చెప్పి నీ వీపు చీలించేస్తా" వెంకటమ్మ శోభ జడ అల్లుతూ, నెత్తి మీద మొట్టింది.

"ఇదిగో ... ఈ నెల రోజులు కానీ, స్కూలు మన్పించేస్తే ఆ పిల్లతో స్నేహం ఎందుకు మానవో చూస్తా ... ఆ గడపలో కాలు పెట్టావో. మీ నాన్న రానీ, నీ కాళ్ళు విరగ్గొట్టిస్తా" రాములమ్మ శివ అన్నం పెడుతూ నెత్తిమీద కొట్టింది.

ఆ రోజు స్కూలుకి వెళ్ళాక శోభకి, శివకి కూడా చాల ఏడుపొచ్చింది. 'అమ్మ స్కూలు మార్చేసి, మరో స్కూల్లో వేస్తుందిట నన్ను' అన్నాడు శివ.

"అవును, మానాన్న వచ్చాక నన్ను తన్నిస్తుందిట" అంది శోభ. ఇద్దరికీ ఏడుపొచ్చింది మళ్ళా. "మనిద్దరం ఆడుకోకుండా ఉంటే నాకు ఏడుపొస్తుంది శివా" అంది శోభ వెక్కి వెక్కి ఏడ్చేస్తూ. "నాకూ అంతే - అసలు ఈ అమ్మలకి బుద్ధి లేదుకదూ" "అయ్యో అలా అనకు అమ్మని ఏమన్నా అంటే పాపం వెలుస్తుంది" ఇద్దరూ చెంపలేసుకున్నారు. ఇద్దరూ అలాగే చాలా సేపు కూచున్నారు.

"ఇదిగో శోభ .. ఓపని చేద్దామా"

"చెప్పు"

"ఇప్పుడు మనకి ఒంటి పూట స్కూళ్ళేగా మనం ఇంటి కెళ్ళకుండా..."

"బాబోయ్ - నాకు భయమేస్తోంది శివా"

"భయపడకు ... గుడి తాతయ్య దగ్గరకెడదాం"

" వెళ్ళ .. వీళ్ళ గురించి అంతా చెప్పేద్దాం..." ఏమిటిరా ఎండలో వచ్చారు. తాతగారు పుస్తకం పక్కన పెట్టారు. అంత ఎండలో నడిచి పిల్లలిద్దరూ వచ్చారు అంటే వాళ్ళ ఏదో

చెప్పకోవాలనే అయివుంటుందని అర్థమయిపోయింది తాతగారికి.

శోభ కళ్ళు తుడుచుకుంటూ విషయమంతా చెప్పేసింది. అవును తాతయ్యా మా అమ్మ నన్ను స్కూలు మాన్పించేస్తుందిట. శోభతో మాట్లాడవద్దు అంటుంది. ఆడుకోవద్దు అంటుంది. ఎలాగ తాతయ్యా" తాతయ్య నవ్వాడు. "మీరిద్దరూ రాత్రి ఏడుగంటలు దాటే వరకు ఇక్కడే ఉండండి. ఆ తర్వాత నేనేం చెప్తే అది చెయ్యండి... సరేనా" అన్నాడు. 'హాయిగా ఆడుకోండి' అన్నాడు బల్లమీదున్న అరటిపళ్ళు చెరోటీ పిల్లల చ్చి.

టైము రెండు గంటలు దాటిపోయింది. పిల్లలు ఇల్లు చేరలేదు. తల్లుల మనసులు కీడు శంకిస్తున్నాయి. ఏమయ్యారో పిల్లలు...

"ఆ దిక్కుమాలిన పిల్లాడి స్నేహమే దీన్ని ఇలా చేస్తోంది" రాములమ్మ ఆ ఇంటి వైపు చూస్తూ మెటికలు విరిచింది.

"నీ పిల్లతో ఆట్లాడుకుంటూ అక్కడే పడిఉంటాడు. మాకు శనల్లే దాపురించారు" ఉమ్మి వేసింది వెంకటమ్మ.

గడియారం ఆరుగంటలు కొట్టింది. పిల్లలు రాలేదు. ఎలాగ ఇంక ఎవరినడగాలి, పోలీసు స్టేషనులో చెప్తే.. వాళ్ళ నాన్నకి తెలిస్తే చంపిపారేస్తారు... తల్లులిద్దరూ వీధి గుమ్మంలో నుంచున్నారు.

గుమ్మంలో రిక్షా ఆగింది. ఆతృతగా చూస్తున్న తల్లులు రిక్షాలోంచి గుడి తాతయ్య దిగటం మాత్రమే కనిపించింది.

"ఏమ్మా .. అలా ఉన్నారేం" తాతయ్య తల్లులు వంక చూస్తూ అన్నాడు "మా పిల్లలు ఇంకా రాలేదు. ఏమయ్యారో ఏమో" ఇద్దరూ ఒకేసారి గొల్లుమన్నారు."చూడండి ... అవులు

ఆవులు కుమ్ములాడుకుంటే దూడల కాళ్ళు విరిగాయట... అలా ఉంది మీ వ్యవహారం... ఏమిటమ్మా చెప్పండి. మీరు పోట్లాడు కోవటమే తప్పు. మీరూ మీరూ పొట్లాడుకుని పిల్లల్ని ఆడుకోనియ్యరా. మాట్లాడుకోనియ్యరా.. మీరసలు తల్లులేనా. ఆ పిల్లల మనసులు ఎంత బాధపడి పోయాయో పాపం".

వెంకటమ్మ, రాములమ్మ ఒకరి ముఖాలు ఒకరు చూసుకున్నారు. "బాబూ ... మా పిల్లలు" ఇద్దరి గొంతులోనూ ఏడుపే.

అంతలోనే చీకట్లో దాగిన శోభ, వ పరిగెత్తి వచ్చి తాతయ్య వెనక దాగారు.

"నా దగ్గర కొచ్చారు కనక పిల్లలు మీకు దక్కారు.... ఇంకోసారి ఇలా జరిగితే..."

"లేదు తాతయ్యా... మమల్ని క్షమించండి.. ఇంకెప్పుడూ మేము పోట్లాడుకోము .. మా పిల్లల్ని బాధపెట్టము" వెంకటమ్మ, రాములమ్మ తాతయ్య పాదాల పైన పడ్డారు. పిల్లలిద్దరినీ తల్లులు గుండెలకి హత్తుకున్నారు.

శోభ, వ ఆ రోజునుంచీ మళ్ళా హాయిగా కలిసి స్కూలు కెడుతున్నారు. హోంవర్కు కలసి చేసుకుంటున్నారు. ఆడుకుంటున్నారు.

"శోభ, నీకోసమే పువ్వులు కొన్నా, రా, జడలో పెడతా" అంది ఆ సాయంత్రం రాములమ్మ.

"శివా, ఇలారారా, ఈ జామపండు తిను" అంది వెంకటమ్మ.

పిల్లలిద్దరూ వీధిలో చక్కగా ఆడుకుంటుంటే రాములమ్మ, వెంకటమ్మ చూసి మురిసిపోయారు.

*****

# 5. ఇదిగో పులి

బేబీ, రాజు భుజాన స్కూలు బాగ్‌లు తగిలించుకుని నెమ్మదిగా నడుస్తూ కబుర్లు చెప్పుకుంటూ వస్తున్నారు.

"ఇదిగో రాజూ... వాడిని చూడు, అటు చూడు" అంది బేబి. సుబ్బారావు త్వరత్వరగా నడుస్తున్నాడు.

"వాడే .. మన సుబ్బిగాడు.. ఈ మధ్య స్కూల్లో కనిపించటం లేదే" చేతిలో ఉన్న ఐస్‌క్రీమ్ చప్పరిస్తూ అన్నాడు రాజు.

'ఇది విన్నావా'

'ఏమిటీ'

"వీడు స్కూలుకి ఎందుకు రావటం లేదో తెలుసా...వీడు బడి ఎగ్గొట్టి సిగరెట్లు తెగతాగుతున్నాడు" బేబీ గొంతు తగ్గించి చెప్పింది.

'నీకెలా తెలుసూ' మొన్న మా తాతయ్యా అగ్గిపెట్టె కొని తెచ్చిపెట్టమంటే, ఆ బడ్డీకొట్టు దగ్గర కెళ్లా ... అక్కడ ఈ



సుబ్బిగాడు రెండు సిగరెట్టు ప్యాకెట్లు కొనుక్కుని, నన్ను చూసి గబగబా వెళ్ళిపోయాడు."

"అవును... మొన్న నేను, మాపిన్ని సినిమానుంచి వస్తూ బస్సెక్కాము... వీడూ ఆ బస్సే ఎక్కాడు. రెండో స్టాపులో దిగిపోయాడు. నన్ను చూసి చూడనట్టు గబగబా వెళ్లిపోయాడు తెలుసా".

"వాణ్ణి ఆపి, మాట్లాడిద్దామా"

"ఆ మనకెందుకూ... ఊరుకో వీడి పని స్కూల్లో చెప్పాలి" బేబి, రాజు గబగబా నడక సాగించారు. అంతలోనే రవి ఎదురయ్యాడు.

"ఏమిట్రా... స్కూలు నించి ఇంటికి రావడానికి ఇంతసేపా.. ..నొచ్చి ఎంత సేపయిందో తెలుసా"

"మేము బోల్డు కబుర్లు చెప్పుకుంటూ వస్తున్నాముగా నాకూ చెప్పరా ఆకబుర్లూ? గబగబా చెప్పేశారు బేబి, రాజు సుబ్బారావు విషయం. "అవును మొన్న మధ్యాహ్నం మా బామ్మని చూడ్డానికి హాస్పటల్‌కి వెడితే, వీడక్కడ కనిపించాడు. ఏదో పెద్ద పని వున్నట్టు హడావిడిగా అటుఇటు పరిగెడుతూ, నన్ను చూసి చూడనట్టే వెళ్ళిపోయాడు.." "అవునా ... అయితే వాడికి అదే" రాజు, బేబి ఒక్కసారి అన్నారు.

"అదేనా అంటే"

"వాడు ఎంత దగ్గుతున్నాడో తెలుసా. ఖంగు ఖంగుమని ఒకటే దగ్గు. పైగా సన్నగా పుల్లలా అయిపోయాయి వాడి కాళ్ళూ, చేతులూనూ" తిప్పుకుంటూ అంది బేబి.

"అదేరా ... క్షయ .. క్షయరోగం" అన్నాడు వెంటనే రాజు.

"అంతే ... వాడికి క్షయ రోగమే - లేకపోతే మనలందరిని తప్పించుకు ఎందుకు తిరుగుతాడు.. వాడు సిగరెట్లు తెగ తాగేస్తున్నాడని.. వీడి విషయం వాళ్ళ నాన్నతో, మనం చెప్పాలి..." రవి ఎంతో ఉత్సాహంగా అన్నాడు.

"ముందు క్లాసులో మనతో పాటు వాడిని కూర్చోనీయ కూడదు. వాడికి క్షయ అని అందరి చెప్పేయాలి పైగా ఇంక వాడు ఫస్టు రాంకు రాడు" నవ్వుతూ దీర్ఘంతీశాడు రాజు.

రేపొద్దున్న క్లాసుకెళ్ళగానే మేష్టారికి ఈ విషయం చెప్పాలని, సుబ్బారావుని క్లాసులో చివరి బెంచీమీద కూర్చో పెట్టాలని నిశ్చయించారు బేబి, రాజు, రవి.

హాస్పటల్ నుంచి ఇంటి కొచ్చాడు సుబ్బారావు. "బాబాయ్ ... ఎంతో దూరం వెళ్ళోల్సొచ్చింది సిగరెట్టు పెట్టెకోసం. ఎలాగూ అగ్గిపెట్టె తెమ్మంటావని అదీతెచ్చాను. అమ్మ సాయంత్రం వచ్చేస్తుందిగా హాస్పటల్ నుంచి. నేను రేపు స్కూలుకె ్ళపోతాను బాబాయ్" అన్నాడు పుస్తకాలు సర్దుతూ.

"వెడుదువుగానీ .. రేపుకాకపోతే ఎల్లుండి.." బాబాయి సిగరెట్టు వెలిగిస్తూ అన్నాడు.

xx

రోజూకన్నా ముందరే మొదటి బెంచీలో వచ్చి కూచున్నారు బేబి, రాజు, రవి. ఇంగ్లీషు క్లాసు మేష్టారు వచ్చారు. అటెండెన్స్ రిజిస్టరుతో.. పిల్లల పేర్లు పిలుస్తూ,

'డి. సుబ్బారావ్' అన్నారు.

"లేడుసార్.. రావటం లేదు.. ఇక రాడండి" అన్నాడు రవి వెంటనే.

'ఏమిటీ .. ఇక రాడా ఏం వాళ్ళ నాన్నగారి ట్రాన్స్‌ఫర్ అయిందా" మేష్టారి మాటకి చేయ్యి నొటికడ్డం పెట్టుకుని ఫక్కున నవ్వారు బేబి, రాజు.

"సుబ్బారావు క్షయ వచ్చిందండి. అందుకని బేబీ నెమ్మదిగా అంది." క్షయా ... కుష్టో... నేను కనుక్కొంటాలే" "క్లాసులో వాడ్ని చివరి బెంచిలో కూచో పెట్టాలిసార్! రాజు అన్నాడు. "చూద్దాంలే .. పుస్తకాలు తెరవండి."

మేష్టారు రెండో రోజు క్లాసుకొచ్చారు. "సుబ్బారావు ఈ మారు కూడా ఫస్టు రాంకే వచ్చాడు. అమ్మా బేబీ, ఒరేయ్ రాజు, రవీ .. ఇలారండి.. ఇదిగో పులి అంటే అదిగో తోక" అనేమాట విన్నరా.. మాట్లాడరేం" ముగ్గురూ తలొంచుకున్నారు.

సుబ్బారావు తల్లి సుస్తీతో ఉంటే వాడు హాస్పటల్ చుట్టూ తిరుగుతు బడికి రాకపోతే, మీరు వాడికి క్షయ వచ్చిందని, అందుకే బడి రావటంలేదని అబద్దాలు ప్రచారం చేస్తున్నారు కదూ. ఇవేన మీ చదువు - ఇందాకే చెప్పానే ఇదిగోపులి .. అని అది అలాంటి వాళ్ళని బట్టి వచ్చింది... ఇంకో సారి ఇలాంటివి ప్రచారం చేస్తారా" ముగ్గురూ చేతులు చాపి, దెబ్బలు తిని చెప్పం మాష్టారూ అన్నారు ఒకేసారిగా.

*****

# 6. ఆది నిష్ఠూరం మేలు

రామయ్య, భీమయ్య వీధి బడిలో ఎనిమిదో తరగతి వరకు చదివి మానేశారు. ఇరుగు పొరుగు ఇళ్ళలో ఉంటారు. ఇద్దరూ ఊళ్ళో ఉన్న పొలం చూసుకుంటూ కాలం గడుపుతున్నారు. భీమయ్య చాలా ఖర్చుదారు. మాట నిలబెట్టుకొనే తత్వం లేదు. రామయ్య మహామోహమాటస్థుడు. ఎవరికీ ఏదీ కాదనలేడు. పైగా రామయ్య కొడుకు, భీమయ్య కొడుకు మహా స్నేహితులు. ఏ చిన్న సహాయమైనా పెద్ద సహాయమైనా రామయ్య భీమయ్యకి చేస్తూ ఉంటాడు.

ఒక రోజు రామయ్య పొలం నుంచి ఇంటి వచ్చేసరి శంకరు, ప్రసాదు మాట్లాడుకుంటూ సందు చివర కనిపించారు. ఆ పిల్లలిద్దరూ ఇంగ్లీషు బడిలో నాల్గోక్లాసు చదువుకుంటున్నారు. వాళ్ళ మాటల్లో మెల్లగా పోట్లాడుకుంటున్న ధోరణి కనిపించింది రామయ్య .



రామయ్య ఇంట్లోకి రాగానే రామయ్య కొడుకు శంకరు లోపలకొచ్చాడు. "ఏమిటిరా పోట్లాట" అన్నాడు రామయ్య. "కాదు నాన్నా రేపు ఇంగ్లీషు పరీక్ష .. ఆ ప్రసాదుని, అదే మీ ఫ్రెండు భీమయ్యగారి అబ్బాయికి నోట్సు ఇవ్వాలిట నేను" అన్నాడు కోపంగా శంకరు. "ఇవ్వు రాసుకుని ఇచ్చేస్తాడుగా"

"ఆ .. తిరిగి ఇవ్వక పోతే"

"ఎందుకివ్వడూ? ఒకవేళ రాత్రి ఇవ్వక పోతే, నేను చదువుకుని పరీక్ష ఎలా రాస్తాను. అయినా నాకేం మొహమాటం. ఇవ్వనని హాయిగా చెప్పేశాను. అంతే" పుస్తకం చేత్తో పట్టుకుని లోపలకెళ్ళి పోయాడు చదువు కుందుకు శంకరు.

సాయంత్రం చల్ల బడ్డాక, వీధి అరుగు మీద కూచున్నాడు రామయ్య. గబగబా వచ్చాడు భీమయ్య.

భీమయ్య, ఏదో తొందరలో ఉన్నట్టుగా హడావిడిగా కనిపించాడు. "ఏమిటి భీమయ్య"

"నాకు అర్జంటుగా రెండు వందలు కావాలి"

"రెండు వందలా?"

"పోనీ డబ్బు ఇవ్వటం నీకు ఇబ్బంది అయితే నీ ఎద్దును యివ్వు. బండి కట్టించుకు వెడతా. నా ఎద్దుకు ఆరోగ్యం బాగాలేదు. రైలు టిక్కెట్లు కొనుక్కుని ప్రయాణం చెయ్యాలి. "నా ఎద్దును ఈవ్వలేనులే కానీ - రెండు వందలంటే."

"ఆ ... ఇద్దూ .. నేను ఎల్లుండి తెచ్చి ఇచ్చేస్తా.."

"ఒక వేళ ఇవ్వలేకపోతే నాకు కొంచెం .. "

"ఊరుకో రామయ్య రెండు వందలు నీకు లెక్క..? అయినా తెచ్చి ఇచ్చేయక ఎక్కడి పోతానూ. ఈ ఊరు, పొలం వదిలి పెట్టి? "భీమయ్య రామయ్యని తొందరచేశాడు. నిజానికి రెండు వందలు ఇవ్వాలని లేదు రామయ్యకి. ఏ నిముషంలో ఏమి అవసరం వస్తుందో డబ్బుతో - అలా అని భీమయ్యకి ఖచ్చితంగా ఈయలేనని చెప్పనూలేడు. చివరికి మోహమాటపడి రెండు వందలు ఇచ్చేశాడు. భీమయ్య "తప్పకుండా ఎల్లుండి ఇచ్చేయాలి" "ఆ.... ఎంద యనూ" భీమయ్య డబ్బు మడిచి జేబులో పెట్టుకుని చకచకా వెళ్ళిపోయాడు.

రామయ్య గుమ్మంలోనే కూచున్నాడు. బాగా చీకటి పడింది. రిక్షా గుమ్మంలో ఆగింది. "నేను బావగారూ వెంకటేశుని" అన్నాడు రిక్షా దిగుతూ పెద్దమనిషి. ఆ మాట ఈ మాట అయ్యాక." బావగారూ, మీ చెల్లెలు మీకు ఒక మాట చెప్పమంది. దాని ఆరోగ్యం బాగాలేదు. డాక్టరమ్మ మందులు రాసి ఇచ్చింది... అందుకని ఆ మందులకయ్యే రెండు వందలు మిమ్మల్ని అడిగి తీసుకోమంది. పంటల్లో డబ్బు చేతికి అందగానే మీకు ఇచ్చేస్తుందట" ఆ మాట వినగానే రామయ్యకి ఏం చేయాలో తోచలేదు. ఇప్పుడేగా ఉన్న డబ్బంతా భీమయ్యకి ఇచ్చేసింది. మీరు ఎప్పటి వరకూ ఉంటారు ఊళ్ళో"

"ఎల్లూండి రాత్రి వరకు".

"ఓ అయితే ఇస్తాను, ఎల్లుండి రాత్రి రండి తప్పకుండా" వేంకటేశు భోజనం చేసి రాత్రి స్నేహితులఇంటి కెళ్ళాడు.

రామయ్య భీమయ్య కోసం ఎదురుచూస్తున్నాడు. తెల్లారేసరి వచ్చేస్తానన్నాడు, ఇంకా రాలేదేమా అనుకుంటూ రామయ్య వీధి గమ్మంలోనే నిలుచున్నాడు. మధ్యాహ్నం రెండు గంటలు దాటింది. నాలుగు గంటలయింది. భీమయ్య రాలేదు. ఎలాగ, వేంకటేశు వస్తాడు, చెల్లెలి మందులు కొనటాని డబ్బు ఇవ్వక పోతే బాగుంటుందా. పైగా ఆ చెల్లెలికి తనంటే ఎంత ఇష్టం. రామయ్య వీధి అరుగు మీద చతికిల పడ్డాడు.

"చూశావా... వచ్చేశాను" ఎంతో ఉత్సాహంగా ఉన్నాడు భీమయ్య. ప్రయాణపు వి షాలు చెప్పాడు. రంగు రంగుల షర్టు కొనుక్కున్నాడట. మంచి సెంటు సీసాకొనుక్కున్నాడట. ఈ కబుర్లన్నీ చెప్పుతున్నాడు కానీ, డబ్బు విషయం మాట్లాడటం లేదు భీమయ్య.

"నా రెండు వందలు" నెమ్మదిగా అన్నాడు రామయ్య. "ఆ విషయమే చెప్పాలను కుంటున్నా... నీ డబ్బు భద్రంగా ఉంది..."

"ఏది... ఇటివ్వు"

"అసలు విషయం విను... ఆ ఊళ్ళో ఎగ్జిబిషన్ ఉంది రామయ్య. ఎంత బాగుందనుకున్నావ్... అక్కడ మా చిన్నమ్మాయి ఒక పట్టుచీర చూసి మురిసి పోయిందనుకో ... ఆ పిల్ల అంత ముచ్చట పడుతుంటే ఊరుకోలేక, నీ కోసం దాచిన, రెండు వందలూ ఆ చీర కొనడానికి పైన వెయ్యాల్సి వచ్చింది" "ఏమిటి ... చీర కొనడానికీ" రామయ్య చాలా కోపం వచ్చింది.

"ఉండవయ్యా .. అంత కోపం దేనికి . నీ డబ్బు ఎక్కడికి పోతుందీ.. ఈ ఊరు, పొలం అన్నీ వదిలేసి నేను వెళ్ళిపోతానా.. కొంచెం ఓపిక పట్టు ... ఒక్క నెలరోజులు పంటల డబ్బు రాగానే" భీమయ్య మాటలకి తల మొత్తుకున్నాడు రామయ్య. ఇప్పుడు వెంకటేశు వస్తే ఏం చెప్పాలి తను. చెల్లెలి మందులకి రెండు వందలు ఇవ్వ లేక పోతే - రామయ్యకి చాలా బాధనిపించింది. ఎదురుగా భీమయ్య కూచునే ఉన్నాడు.

"అందుకేనయ్యా అన్నారు పెద్దలు అంత్య నిష్ఠూరం కన్నా ఆది నిష్ఠూరం మేలని- అసలు నాదే తప్పు ముందే నీతో డబ్బు లేదని చెప్పాల్సింది" రామయ్య అలా అనగానే, భీమయ్య కస్సున కోపంతో లేచాడు. "ఏంది రామయ్యా .. బోడి రెండు వందలకి ఇంత గోల చేస్తున్నావు.. రెండు నెలల వరకు ఇవ్వను - ఏం చేసుకుంటావో చేసుకో" గబగబా వెళ్ళిపోయాడు భీమయ్య.

ఎవర్ని అప్పడిగి వేంకటేశుకి డబ్బు ఇచ్చి పంపాలో అనే ఆలోచనలో మునిగి పోయాడు రామయ్య.

*****

# 7. చెరపకురా చెడేవు

ప రీక్షలు ఇంకా నాలుగు రోజులున్నాయి. పుస్తకాలు, నోట్సులు, జామెట్రీ బాక్సు, పరీక్ష పాడ్, బాగా రాసే బాల్‌పాయింట్ పెన్ను, చక్కగా చెక్కిన పెన్సిలు, రబ్బరు, బ్లేడు ఇవన్నీ సిద్ధం చేసేసుకుంటున్నారు పిల్లలంతా. రాము దస్తూరీ చాలా బాగుంటుంది. ముత్యాల లాంటి గుండంగా ఉండే అక్షరాలతో, రాము నోట్సులు ఎంతో బావుంటాయి చూడ్డానికి. పైగా రాము తెలివైనవాడు కష్టపడి చదువుకుంటాడు. రాము అంటే టీచర్లకే కాదు, పిల్లలందరి కూడా ఎంతో ఇష్టం. ఎందుకంటే, ఎవరైనా సరే, "ప్లీజ్, నా నోట్సు రాసి పెట్టవా" అంటే చాలు కాదనకుండా గుండ్రంగా రాసి పెడతాడు. ఎవరైనా "నాకు ఈ లెక్క రాలేదు, చెప్పవా అంటే విసుక్కోకుండా చెప్తాడు. సాధారణంగా పిల్లలు వాళ్ల నోట్సులోని కాగితాలు చింపుతూనే ఉంటారు కదా! వర్షం



వచ్చినపుడు కత్తి పడవ చేయడాని , క్లాసులో వున్నప్పుడు బాణాలు చేసి విసరటానికి, ముగ్గులు నేర్చుకోవటానికి, బొమ్మలు గీయటాని , కొంచెం కూడా వెనకాడకుండా నోట్సులోంచి పేపరు తక్కున చించేయటం పిల్లల చాలా పెద్ద అలవాటు. అయితే, రాము మాత్రం ఒక్క నాడు కూడా నోట్సులోంచి కాగితం చించ_దు. అలా చించితే నోట్సు పాడయిపోతుందని రాముకి భయం.

ఖరం కూడా రాము క్లాసే. కానీ రాము అంటే ఇష్టం ఉన్నా, కొంచెం అసూయ కూడా ఉంది. అందరూ రాముని మెచ్చుకుంటుంటే శేఖరాని కోపం వచ్చేది."ఏమిటి వీడి గొప్ప, బాగా చదువు తాడా? అయితే ఏమిటీ, తనూ చదవగలడు, కావాలంటే, అని ఎన్ని సార్లు అనుకున్నాడు. ఇంటి వెళ్ళగానే చదువుకుందామనుకున్నా, వెంటనే సందు చివర గోలీలు ఆడుకుందుకు వె ్ళపోతాడు. కానీ ఈ మధ్య ఎలాగైనా రామూని ఓడించాలని చాలా సార్లు అనుకున్నాడు ఖరం. కానీ ఎలాగా, ఎంతో కష్టపడి చదవాలి, నోట్సు ్ద్ధగా రాసుకోవాలి, రోజూ స్కూలు రావాలి. అబ్బ ఎంత కష్టం - ఆ రామూని ఎలా ఓడించాలా, తక్కువ మార్కులు రాము వచ్చేలా చేయటం ఎలాగా అని రాత్రి అంతా ఆలోచిస్తూనేఉన్నాడు. ఇంకా ప క్షలు నాలుగు రోజు_కదా!

రా_ ఏడు గంటలయింది. తలుపు కొట్టాడు ఖరం. చదువుకుంటున్న పుస్తకం పక్కన పెట్టి వచ్చాడు రాము. "నాకు నీ నోట్సు కావాలి, ఇయ్యవా" అన్నాడు శేఖరం "ఇప్పుడా .. ఇంక ప క్షలు దగ్గర కొచ్చేశాయి కదా - మరి నా నోట్సు నీకిస్తే నేనేం చదువుకోనూ"? అన్నాడు. "రేపు సాయంత్రాని నేను రాసుకుని నీ చ్చేస్తా.. స్కూల్లో టీచర్లు

రివిజన్ కదా చేసేది, నేను స్కూలు రాకుండా నోట్సు రాసుకుని, నీకు తెచ్చి ఇచ్చేస్తాగా" బతిమాలాడు శేఖరం. "నిజంగా రేపు సాయంత్రం తెచ్చి ఇచ్చేస్తా" ఇంగ్లీషు, తెలుగు, సైన్సు నోట్సు ఇవ్వు... చాలు." రాము ఇచ్చిన నోట్సు శేఖరం తీసుకుని గబగబా వెళ్ళిపోయాడు. "సరే, ఆ నోట్సు వచ్చే లోపల సోషల్, హిందీ, లెక్కలు ఇవన్నీ చదువుకోవచ్చు" అనుకున్నాడు రాము.

ఆ నోట్సు తెరిచి చూడగానే శేఖరం మనసు మారిపోయింది. "ఇంత బాగా రాసుకున్నాడు, ఇవన్నీ బాగా బట్టీ పట్టేస్తాడు, అందుకే వాడి ఫస్టు మార్కు... ఈ మాటు ఎలా వస్తుందో చూస్తాగా" శేఖరం రాము నోట్సు తీసి తెలుగు, సైన్సు కొద్దిగా ఎక్కించుకున్నాడు. ఇంగ్లీషు నోట్సు చూస్తుంటేనే భయంగా ఉంది. తనకేమీ రావు. ఎప్పుడు రాసుకుంటాడూ, ఎప్పుడు నేర్చుకుంటాడు తను! ఈ నోట్సు చించి పారేస్తే ఛఛ చించకూడదు. ఇంకో ఉపాయం ఆలోచిస్తా. శేఖరం తన తెలివికి తను మురిసిపోయాడు. ఆ సాయంత్రం రాము ఇంటికెళ్లాడు. "ఆంటీ, రాము నోట్సు ఇవిగో స్కూలునించివచ్చాకఇచ్చేయండి" అని బల్లమీద నోట్సు పెట్టి గబగబా వెళ్ళిపోయాడు. ఇంటి కొచ్చి ఎంతో ఆనందపడి పోయాడు, భలేపని చేశాడు తను అని అనుకుంటూ.

రాము స్కూలు నించి వచ్చాక శేఖరం పుస్తకాలు ఇచ్చిన విషయం చెప్పింది తల్లి."సరేలే" అన్నాడు రాము. రాత్రి తొమ్మిదయ్యాక ఇంగ్లీషు నోట్సు చదువుదామని అనుకుంటూ నోట్సు కోసం చూస్తే కనిపించలేదు. తను శేఖరానికిచ్చిన సైన్సు [illegible] శేఖరం

ఇల్లు కూడా తన తెలియదు. ఎలాగ, ఏడు పొచ్చింది రాము . తెల్లారితే ప ·క్ష.

"ఏమిటిరా ఆ ఏడుపు, ఇప్పుడేం చేస్తావు.. ఆ పుస్తకం ఇటివ్వు. ముఖ్యమయిన వాటికి నోట్సు చెప్తా రాసేసుకో. టైము పాడు చెయ్యకు" అంటూ రాము అక్క లలిత, రాము ఇంగ్లీషు బుక్కు తీసుకుని గబగబా నోట్సు చెప్పేసింది. అన్నీ రాసుకున్నాడు రాము. పైగా ఇంతకు ముందు బాగా చదువు కున్నాడు కదా.

శేఖరం చాలా గొప్పగా అనుకున్నాడు, రాముని తను ఎంత తెలివిగా మోసం చేశాడో అని. ఆ ఇంగ్లీషు నోట్సు తను ఇవ్వనేలేదు కదా - ఈ రాత్రి అంతా చదివేసి, వాణ్ణి ఓడగొట్టాలి - అంతే, అనుకుంటూ నోట్సు తీసుకుంది వచ్చాడు - ఏదీ, కనిపించదేం!! అసలు ఎక్కడ పెట్టాడూ! వంటింట్లో బియ్యం డబ్బా పైన పెట్టాడు, ఎవరూ తీయరని, తను అర్ధరా లేచి చదువుకోవచ్చని, ఒక వేళ రాము వచ్చినా నీ చ్చేశానుగా అని ఏదో చెప్పేయవచ్చని అనుకుని జాగత్తగా పెట్టాడు - ఏదీ మరి!

"చెల్లాయి.. నా నోట్సు ఇక్కడ గుర్తుగా పెట్టాను. ఏమైందీ"

"నోట్సా .. ఆ, అన్నయ్యా, ఎర్ర అట్టదేనా"

"ఆఁ అదే.. ఎక్కడ దాచావో చెప్పు."

"నాకేం తెలియదు-అమ్మ బియ్యం డబ్బా మూత తీస్తుంటే కిందపడింది. ంద మంచినీళ్ళ గిన్నె ఉంటేను"

"అందులో పడిందా- అయ్యయ్యో! ఏదీ చూపించు" శేఖరం ఖంగారు పడిపోయాడు. నీళ్ళలో నానిపోయి ముద్దగానే ఉన్న ఇంగ్లీషు నోట్సు ఖరం అలాగే చూస్తూ ఉండి పోయాడు.

రాత్రి పదిగంటలు దాటిపోయింది. ఏం చదువుకుంటాడూ, ఏం పరీక్ష రాస్తాడూ. ఖరాని ఏడుపొచ్చింది. "చెరపకురా చెడేవు అంటే ఇదేనా" ఖరం ఆ పుస్తకాన్ని తెచ్చి ఫ్యాను కింద ఆర బెట్టాడు.

పరీక్ష రాసి బయటకొచ్చిన రాము ఎంతో సంతోషంగాఉన్నాడు. ఈ మాటూ తను ఫస్టు వస్తాడు. ఎంతో ఉత్సాహంగా ఉన్నాడు రాము.

"ఏంరా పరీక్ష బాగా రాశావా" రాముడు అడుగుతుంటే ఏడుపు మొఖం పెట్టాడు ఖరం.

సెలవులు అయిపోయాక మళ్ళ స్కూలు తెరిచారు. అన్నిటిలోనూ ఫస్టు వచ్చాడు రాము. ఖరం ముప్పైమంది క్లాసులో ఇరవై తొమ్మిదో రాంకు వచ్చాడు. పైగా ఇంగ్లీషులో ఆరు మార్కులొచ్చాయి. ప్రోగ్రెస్ కార్డు చూస్తూ తలదించుకున్నాడు ఖరం.

*****

# . అన్నం పెట్టిన ఇంటికే...

సోము చాలా బీద పిల్లాడు. తండ్రి లేడు. తల్లి నాలుగిళ్ళలో పనిచేసి పిల్లాడిని పోషిస్తోంది. వీధి బడిలో సోముని చేర్పించింది. పాపం బీద పిల్లాడు అని ఆ స్కూల్లో చేరిన కొద్దిరోజులకే జాలి కలిగింది రాజమ్మ టీచరుకి. 'ఒరేయ్ సోమూ, నువ్వు మీ అమ్మ మా ఇంట్లో వెనక గదిలో ఉండండి. ఒక సారి మీ అమ్మని రమ్మను, మాట్లాడుతాను' అంది రాజమ్మ.

సోము తల్లిని వెంటబెట్టుకుని రాజమ్మ టీచరింటికి వచ్చాడు.

"అమ్మ .. ఈ పిల్లాడికి నాలుగు అక్షరం ముక్కలొస్తే నాలుగు రాళ్ళు సంపాదించుకు బతుకుతాడని నాకు ఆశ. ఒక నాడు ఉన్న వాళ్ళమే. కాలం కలసి రాక అనుకోకుండా భర్త పోయేసరికి ఈ గతికి వచ్చేశాము. మీ లాంటి పెద్దలు



దయదలిస్తే" రాములమ్మ కన్నీళ్ళు పెట్టుకుంది. రాజమ్మ సహజంగా ఎంతో జాలిగుండె కలది. ఎవరి బాధని చూడలేని మనసు ఆమెది.

"నువ్వు, వీడు మా ఇంట్లో ఆ వెనక గదిలో ఉండండి. వీడి పుస్తకాలు, ఫీజులు అన్నీ నేను చూసుకుంటా. నాకు కాస్త సాయంగా ఉంటారు. నేనూ, బాబాయిగారేగా ఇంట్లో ఉండేది. మా అబ్బాయి ఢిల్లీలో ఉన్నాడు. అంది రాజమ్మ రాములమ్మ వంక చూస్తూ.

"అంతకంటేనా తల్లీ... రేపే వస్తాము - వీడికి నాలుగు అక్షరం ముక్కలు వస్తే, ఇక నా బతుకునాధి"అందినమస్కరిస్తూ.

సోము, రాములమ్మ తెల్లారేసరికి వచ్చేశారు. చిన్నగదిలో చేరారు. రాజమ్మ వాళ్ళకి కొద్దిపాటి గిన్నెలు ఇచ్చింది. పొద్దున్నే వాళ్ళు తినే బ్రేక్‌ఫాస్టు సోమూకి ఇచ్చేది. పళ్ళు, స్వీట్లు తాము తిన్నప్పుడల్లా సోమూకీ పెట్టేది. రాజమ్మకి పిల్లలంటే ఇష్టమేకాక, సోమూలాంటి బీద పిల్లాడికి సహాయం చేయాలని ఎంత కాలంగానో అనుకుంది రాజమ్మ. పైగా ఆమె ఎంతో ఆస్తి ఉంది. తన , తన భర్తకి ఎంతకావాలి కనక, సంక్రాంతి పండగకి మంచి బట్టలు కుట్టించింది సోముకి. "ఒరేయ్ సోమూ, కొత్త బట్టలు వేసుకుని, చక్కగా తల దువ్వుకుంటే ఎంత బాగున్నావో తెలుసా" అంది పిల్లాడిని చూస్తూ. ఇంట్లో చేరిన నెలరోజులకే సోమూలో ఎంతో మార్పు వచ్చింది. బుగ్గలు నున్నపడ్డాయి. ఒళ్ళు చేశాడు. తలదువ్వుకోవటంలో, చెప్పులు తొడుక్కోటవంలో ఎంతో ఒరు వచ్చింది.

రాములమ్మ అప్పుడప్పుడు సోముని చివాట్లు వేయటం వింటోంది రాజమ్మ. "ఎందుకే వాణ్ణి తిట్టి, కొడుతున్నావు"

అంది గుమ్మంలో నుంచుని. "ఆ చదువు కోవటం లేదనీ" అంది రాములమ్మ.

సోము రోజు రోజుకీ చదువు మీద ఆసక్తి తగ్గి పోయింది. స్కూలుకి వెడుతున్నానని బయలుదేరి, ఎక్కడెక్కడో తిరిగి సాయంకాలానికి ఇల్లు చేరేవాడు. చెడ్డ స్నేహాలు అలవాటయ్యాయి.

ఓ రోజు రాత్రి పదిదాటాక ఇంటి కొచ్చాడు సోము. 'ఏరా ఇంత రాత్రి వరకు ఎక్కడ తిరుగుతున్నావ్"? అడిగింది రాజమ్మ. వినిపించుకోకుండా ఇంట్లోకి వెళ్ళిపోయాడు. లోపల తల్లితో అంటున్నాడు, "నేను ఎప్పుడొస్తే ఈమె కెందుకూ, నోరు మూసుకోమను" రాజమ్మ తన చెవులను నమ్మలేక పోయింది. సోము యేనా ఈ మాట్లాడుతోంది?"

"ఇదుగో రాజీ, నా వాచీ ఏదీ?" ఇంటి యజమాని రామయ్యగారు ఇల్లంతా వెతి అన్నాడు "ఏమో ఎక్కడికి పోతుంది చూడండి" అంది రాజమ్మ అంతా వెతికినా ఎక్కడా కనిపించలేదు వాచీ" మీరే వదులుగా పెట్టు కొని ఉంటారు, పోయి ఉంటుంది" అంది రాజమ్మ.

నెమ్మదిగా ఇంట్లో వస్తువులు మాయమవటం మొదలుపెట్టాయి. రాజమ్మ సోము తీస్తున్నాడని అనుకోటానికి కూడా మనసు రాలేదు. బీద వాడు కదా అని తను వాణ్ణి అనుమానించటం మహాపాపం కదూ అనిపించింది. నిన్న పేపర్లు కొనడానికి వచ్చిన అబ్బాయి, ఎదురుగా బల్లమీద ఉంటే జేబులో వేసుకుని ఉంటాడు అనుకుని సరిపెట్టుకుంది. వారం రోజులయాక దేవుని పూజా మందిరంలో ఉన్న వెండి కుందులు పోయాయి. దొడ్లో ఆరేసిన పట్టు చీర పోయింది. ఏమిటిది? ఇక మనసు ఉండబట్ట లేక పోయింది

రాజమ్మ."రాములమ్మ .. ఇలారా, ఒరేయ్ సోమూ.. ఇంట్లో వస్తువులన్నీ పోతుంటే ఏమీ పట్టనట్టే ఉన్నారేమిరా... ఎలా పోతున్నాయో, ఏమిటో? అలా" అంది నెమ్మదిగా "నాకు తెలుసు అమ్మా" అన్నాడు సోము.

'నీకు తెలుసా చెప్పేమరి'

"మీ కారు డ్రైవరే"

"ఏమిటీ కారు డ్రైవరా, వాడు ఇంట్లోకేరాడు... పోన్లే నే కనుక్కుంటా... బాబూ సోమూ, నీ మనసు కష్టపెట్టుకోకు" అంది బాధగా రాజమ్మ.

"ఏమండీ .. ఎలా పోతున్నాయంటారూ... ఇంటి దొంగను ఈశ్వరుడయినా పట్టలేడు అంటే ఇదేమరి.." అంది భర్తతో.

"నువ్వూర్కో ... నేను అన్నీ కనిపెడతా .. దొంగను పట్టుకుంటాగా" చాలా ధైర్యంగా అన్నాడు రామయ్య.

ఆ రాత్రి రామయ్య మేడ మీద చీకట్లో దాగి దొడ్లో ఉన్న జామచెట్టు వంక జాగ్రత్తగా చూస్తున్నాడు. అంతలోనే స్టీలు బిందె తెచ్చాడు సోము. జామచెట్టు ంద ఉన్న మనిషి చేతి చ్చి, డబ్బుతీసుకుని జేబులో పెట్టుకున్నాడు సోము. అంతా కనిపెడుతూనే ఉన్నాడు రామయ్య. సోము వెళ్ళగానే మేడ దిగి, లోపల కొచ్చాడు రామయ్య. సోము నోట మాట రాలేదు."ఛ, రాజమ్మ నిన్నెంత ప్రేమగా చూసిందిరా .. దానికిదా ప్రతిఫలం .. ఫో, వెంటనే వెళ్లిపో" ఆ రాతే రాములమ్మ, సోము ఇల్లు ఖా చేసి వెళ్లారు.

వారం రోజులయింది. "అమ్మా, అమ్మా" ఇంటి పనిమనిషి హడావిడిగా వచ్చింది."ఏమిఁ" రాజమ్మ ఖంగారుగా అంది. "అదేనమ్మా, అన్నం పెట్టినింటికి కన్నం పెట్టటం అంటా ,

అట్లాగుంది. ఆ సోము గాడు మనింట్లోంచి ఎత్తుకుపోయిన వెండికుందులు బజారులో అమ్మేతుంటే పోలీసులు పట్టుకున్నారు." రాజమ్మ విని ఊరుకుంది. కృతఘ్నత అంటే ఇదే అనుకుంది మనసులో.

రాములమ్మ నాలుగిళ్ళలో పనిచేసుకుంటునూ ఉంది. సోము చదువు మానేసి రోడ్ల వెంట తిరుగుతూనే ఉన్నాడు.

*****

# కంచె చేనుమేస్తే

పిల్లలందరిలో కొంచెం పెద్దవాడు శరత్. అంతేకాకుండా ఎంతో నిదానంగా ఉంటాడు. చదువులో కూడా బాగా ఉంటాడు. అందుకనే శంకరయ్యా మేష్టారు ఆలోచించి ఆలోచించి శరత్‌ని క్లాస్‌లీడర్ చేశారు. క్లాసులో ఉన్న పిల్లలందరూ, మేష్టారు క్లాసులో లేనప్పుడు శరత్ మాటవినాలి. మాట్లాడుతూ, అల్లరి చేస్తూ ఉంటే వాళ్ల పేర్లన్నీ కాగితం మీద ఎక్కించి మేష్టారికి చెప్పాలి శరత్. హోంవర్కు పుస్తకాలన్నీ అందరి దగ్గరా తీసుకుని మేష్టారి అప్పగించాలి. ఇలాంటి పనులెన్నో బాధ్యతగా చేయాలి శరత్ క్లాస్ లీడరు అన్నపుడు.

క్లాసు లీడరు అయ్యాక శరత్ స్కూలు ఒక్క రోజుకూడా ఆలస్యంగా రావటం లేదు. అది వరకటి కన్నా బాగా చదువుతున్నాడు. శరత్ అంటే పిల్లలందరి భయం ఏర్పడింది. మేష్టారు నపుడు అల్లరి చేసినా, మాట్లాడినా మేష్టారికి శరత్



పేర్లు ఇస్తాడనే భయం బాగాఉంది క్లాసులో. రెండు నెలలు బాగా గడిచాయి. వెనక బెంచీలో కూచున్న బాలు, రాజు ఇంగ్లీషు హోంవర్కు చేయనే లేదు. హోంవర్కు పుస్తకాలు అన్నీ పిల్లల దగ్గర నుంచి తీసుకుంటున్నాడు శరత్. చివర బెంచి దగ్గర వచ్చేసరికి బాలు, రాజు బతిమాలటం మొదలు పెట్టారు శరత్ని. "శరత్ అన్నా .. ఈ ఒక్కసారికే .. హోం వర్కు చేయలేదని మా నోట్సులు లేవని సార్కి చెప్పద్దు... ప్లీజ్.. అన్నారు బాలు, రాజు. "తప్పురా ... నేను అలాంటి పనులు చేయను ... పైగా నన్ను క్లాస్ లీడరుగా మేష్టారు పెట్టాక నేను ఇలా చేస్తే ఎలా .. ఏం, హోం వర్కు చేయ దు. సార్ చేత దెబ్బలు తినండి" అన్నాడు ఖచ్చితంగా "ప్లీజ్.... ఒరేయ్ శరత్ ... ఈ ఒక్కసారికేగా ..." శర మొత్తపడ్డాడు. "సరేలే గట్టిగా అనకండి... హోం వర్కు చేయని వాళ్ళ పేర్లలోంచి మీ పేర్లు కొట్టేస్తున్నా" అన్నాడు మెల్లగా. లంచ్ టైములో బాలు, రాజు శరత్కి కాడ్బరీ చాక్లెట్ కొనిఇచ్చారు.

ఇంగ్లీషు మేష్టారు క్లాసుకి వచ్చి "మీటింగ్ అవుతోంది. అయే వరకు క్లాసు చూసుకో" అని చెప్పి వెళ్లిపోయారు. శరత్ పిల్ల లెవరూ అల్లరి చేయకుండా నిశ్శబ్దంగా ఉండేలా చూస్తున్నాడు. అంతలో ఎవరో బుడగ ఊది పేల్చారు.'ఢాం' అని శబ్దమయింది. పిల్లలంతా గొల్లున నవ్వారు. శరత్ గబగబా రెండో బెంచి దగ్గరకొచ్చాడు. "మీరే ఈ పని చేసింది. ఇదిగో ఇక్కడే ఉంది బుడగ ముక్క ... మీ ఐదుగురి పేర్లు రాస్తున్నా" అన్నాడు కోపంగా. అందులో ఇద్దరు మాట్లాడకుండా ఊరుకున్నారు. "నేనేం చేయలేదు... అసలు బుడగ కొన్నది, క్లాసులో ఊదింది వాడు. నాపేరు ఎందుకు రాస్తావూ వాడి పేరు రాయి అంతే" అన్నాడు వి క్రమ్. "నాపేరెందుకు

రాస్తావు... బుడగ విరక్కొట్టింది వాడు. వాడి పేరు రాయి" అన్నాడు శ్రీను. శరత్ ఎవరిమాట వినకుండా కొన్ని పేర్లు రాశాడు. మేష్టారు క్లాసుకి రానేలేదు ఆ పేర్లు చూపించటానికి. రేపు చూపిస్తాను అనుకున్నాడు శరత్. స్కూలు అయిపోయింది. విక్రమ్, ్రను, శరత్‌దగ్గరకొచ్చారు. "మనం మనం ఫ్రెండ్స్ కదరా.. మాపేర్లు రాస్తే ఎలా రేపు మేష్టారు చెయ్యి చాపమని దెబ్బలు కొడితే ఆ వెనక బెంచిలో ఉన్న బాలు, రాజు నవ్వుతారురా.. మాపేర్లు చెప్పద్దు మేష్టారికి. ఇదిగో శరత్ ... ఇది నీకోసమే తెచ్చా. మా నాన్న దగ్గర ఎన్నో ఉంటాయి." అంటూ కీచైన్ శరత్ జేబులో పెట్టాడు విక్రమ్. శరత్ నవ్వుతూ ఊరుకున్నాడు. " ఆకాగితం ఇటివ్వు మేమే మా పేర్లు కొట్టేసి, ఇంకో కాగితం మీద రవిగాడు, విజయ పేర్లు రాస్తాంలే" అన్నారు.

"అదేమిటిరా... తప్పుకదూ"

"తప్పులేదు, గిప్పులేదూ... మేష్టారడిగితే వద్దన్నా మాట్లాడారు అని చెప్పేయ్" విక్రమ్, ్రను వెళ్ళిపోయారు. కీచైన్ బలేనచ్చింది శరత్‌కి.

లెక్కల మేష్టారు క్లాసులో కొచ్చి శనివారం పరీక్ష పెడతానన్నారు. కొందరు పిల్లలు'వద్దుసార్' అన్నారు. కొద్దిమంది పిల్లలు 'పెట్టండీ' అన్నారు. మొత్తానికి శనివారం క్లాసులో మొదటి ఛాప్టరులో పరీక్ష పెడతానని చెప్పి వెళ్లిపోయారు మేష్టారు. నిజానికి శరత్ కూడా పరీక్ష రాయాలని లేదు. మేష్టారు వెళ్ళిపోగానే, "మనం పరీక్ష రాయద్దు" అన్నాడు శరత్. శరత్ అంటే ఇష్టమున్న వాళ్ళందరూ, లెక్కలంటే భయమున్న వాళ్ళందరూ "అవును, పరీక్ష రాయవద్దు" అన్నారు. కానీ క్లాసులో కొందరికి ఇదినచ్చలేదు. చాలా బుద్ధిగా

చదువుకునే మంగళ, లెక్కలు బాగా చేసే ఆనంద్ మాత్రం పరీక్ష పెట్టాల్సిందే అన్నారు."మీరిద్దరు చెప్తే పెడతారా... ఎలా పెడతారో మేము చూస్తాం. ఒరేయ్ శరత్ ప క్ష పెట్టడాని వీ్లదురా" అన్నారు బాలు, రాజు, వి ్మ్, ్ను.

శరత్ మేష్టారి దగ్గర కె ్ళ వినయంగా నిలబడ్డాడు. "ఏమో మేష్టారూ, పిల్లలెవరూ శనివారం పరీక్ష రాయరుటండీ.. నేను రాయమని చెప్తే వినకుండా, నామీద కోపం వచ్చిందండీ వాళ్ళకి.. నువ్వొక్కడివే పరీక్ష రాసుకో, అన్నారండి. పైగా"శరత్ చేతులు కట్టుకు నిలబడ్డాడు. లెక్కలు మేష్టారు ఆలోచించారు. "నాకు తెలుసయ్యా.. నువ్వు మంచి పిల్లవాడివని. నీకు పరీక్ష ఎప్పుడు పెట్టినా ఫరవాలేదు. కానీ, ఆ పిల్లలందరూ వద్దంటుంటే ఎలాగ.. సరేగానీ, ఇంకా పదిరోజులయ్యాక పరీక్ష పెడతానని చెప్పు. బాగా నేర్చుకోమను" శరత్ బుద్ధిగా తలఊపాడు. "ఇటు చూడు.. క్లాసులో ఒక్కరు కూడా పరీక్ష రాస్తామని అనలేదా... మంగళ, ఆనంద్, జయ వీళ్ళు కూడా పరీక్ష రాస్తామని అనలేదా" గట్టిగా అడిగారు మేష్టారు. "ఎవ్వరూ రాస్తామనటం లేదు సార్" అన్నాడు శరత్. ఉత్సాహంగా గది దాటి బయట వచ్చేశాడు. మంగళకి, ఆనంద్‌కి శరత్‌పైన చాలా కోపం వచ్చింది. ఆసలు శరత్ పద్ధతే నచ్చటం లేదు. ఈమధ్య తన ఇష్టమైన వాళ్ళని ఏమీ అనడు. ఇష్టం లేని వాళ్ళ పేర్లు పెద్దకారణం లేకపోయినా మేష్టారికి చెప్పి కొట్టిస్తున్నాడు.... శరత్ లాంటి వాడు క్లాసు లీడరుగా ఉంటే ఇలాగే ఉంటుంది అనుకున్నారు మంగళ, ఆనందూను.

దీనికేమైనా ఉపాయం ఆలోచించాలి అనుకున్నారు వాళ్ళు. ధైర్యం ఉంటే ఏ పనియైన చేయవచ్చు కదా! ఇద్దరూ కలసి స్టాఫ్ రూంలో వెళ్లారు. ఆ పిల్లల్ని చూడగానే స్టాఫ్

రూం ఎందుకు వచ్చారు అని మేష్టార్లంతా వాళ్ళకేసి చూశారు. వాళ్ళు తిన్నగా ఇంగ్లీషు, లెక్కలు చెప్పే మేష్టార్ల దగ్గర కెళ్ళారు. క్లాసులో జరుగుతున్న విషయాలన్నీ ఉన్నది ఉన్నట్టుగా చెప్పేశారు. "ఎంతో మంచి పిల్లవాడనుకున్న శరత్ ఇలా తయారయ్యాడా..? కంచే చేనుమేస్తే కాపలావాడు ఏమి చేయగల డన్నట్లు, క్లాస్ లీడరే ఇలా చేస్తే .. అరెరే, అమ్మా, మంగళా, బాబూ ఆనంద్, మీరు మాకు చెప్పటం మంచిదైంది. కపోతే ఈ ఏడాది అంతా శరత్ క్లాసు లీడరుగా ఉంటే, ఇంకా ఎంత పాడయిపోయేదో క్లాసు... వెరీగుడ్, నేవస్తున్నా పదండి" అన్నారు ఇంగ్లీషు మేష్టారు.

"శరత్, ఇలారా.. కంచె చేను మేస్తే ఏమవుతుందో విన్నావా... ఆ నిన్ను లీడర్‌గా పెట్టినందుకు ఇలాగా నువ్వు చేసేది..? నువ్వే పిల్లలందరినీ చెడగొట్టేస్తున్నావ్... అబద్ధాలు చెప్పుతున్నావ్.. నువ్వు పదిరోజులు క్లాసు రావద్దు... హెచ్.యమ్.గారితో మాట్లాడి నీకు, టి.సి. ఇప్పించేస్తా. ముందు క్లాసులోంచి వెళ్ళిపో" మేష్టారుకోపాని గజగజ వణికి పోయాడు శరత్. పిల్లలందరూ నిశ్శబ్దంగా ఉన్నారు.

ఆ తర్వాత ఆనంద్ క్లాస్ లీడరయ్యాడు. పిల్లలందరూ అన్ని పరీక్షలూ శ్రద్ధగా రాశారు. శరత్ వెనక బెంచీలో కూర్చున్నాడు.

*****